




# కృష్ణాజిల్లా రచయితల సంఘం

సుప్రసిద్ధ భాషా శాస్త్రవేత్త, బహుగ్రంథకర్త

## ఆచార్య కోరాడ మహాదేవ శాస్త్రి గారికి

## కీ॥శే॥ మండలి వెంకట కృష్ణారావు ప్రతిభాపురస్కారం

భాషాతపస్వీ !

అగాధమైన భాషా శాస్త్ర మహార్ణవాన్ని చారిత్రకాధార మంథరంతో మథించి, తెలుగు పలుకుల మధురామృతాపగావిర్భావ స్వరూప స్వభావావిష్కారమొనర్చిన మీ అశేష శేముషీ వైశిష్ట్యాన్ని చక్షురక్షర ప్రత్యక్షంగా సందర్శించగలిగింది ఆంధ్రలోకం. పరిశీలన, పరిశోధన, పరిష్కారము ముప్పేటలై పెనగొని భాషా సరస్వతిని మూర్తీభవింపజేసిన పరిణత సారస్వతమూర్తికివే అక్షర నీరాజనాలు.

విద్వన్మణీ !

భారతదేశ చరిత్ర, అర్థిక శాస్త్రములను ఒకసారి, ఆంధ్రభాషా సాహిత్య సమీక్షను మరొకసారి అధ్యయనాంశాలుగా, మదరాసు విశ్వ విద్యాలయోన్నత పట్టభద్రతా స్వీకారమును అమ్రేడిత మొనర్చుట మీ విద్యాసముపార్జనార్ణవమునకు మచ్చుతునుకలు. కలకత్తా విశ్వవిద్యాలయమున మీరొనర్చిన భాషాశాస్త్ర తులనాత్మక పరిశీలన, "హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు" అనే పరిశోధనాత్మక సిద్ధాంత గ్రంథ సమర్పణ కారణంగా మీరు గడించిన మరియొక ఉన్నతపట్టము, అత్యంత గౌరవాత్మకమైన డి.లిట్ పట్టము, మీ విద్యా పారంగ తత్వమునకు, నిరంతరాన్వేషణాతత్పరతకును నిదర్శనములు.

పరిశోధకాధ్యాపకాచార్యవర్యా !

మదరాసు విశ్వవిద్యాలయములోని భారతదేశచరిత్ర విభాగములోను, సిమ్లాలోని భారతప్రభుత్వ శ్రామిక పరిశోధనా కేంద్రములోను, న్యూఢిల్లీలోని ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ చాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీలోను, కలకత్తాలోని భారత పురావస్తు కేంద్ర మానవధర్మశాస్త్ర విభాగములోని ప్రాచీనభాషాధ్యయనశాలలోను మీరు గడించిన పరిశోధనానుభవం అపారం, అమేయం. అన్నామలై విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రాధ్యాపకునిగాను, ఆచార్యునిగాను, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయములో ప్రధాన నిర్వహణాధికారిగాను, ప్రధానాధ్యాపకాచార్యునిగాను, మీరు నిర్వహించిన పదవీ పరంపరలు మీ కీర్తి కిరీటమున మెఱుగులు తురగలించే మేలి ముద్రలు. అంతేకాక జర్మనీ దేశపు కొలోనీ విశ్వవిద్యాలయమునకు గౌరవ ఇండోలజీ ప్రొఫెసరుగా ఆహ్వానింపబడటం మీ మేథా సంపత్తికి లభించిన అంతర్జాతీయ గౌరవం.

పదవీ నిర్వహణదక్షా !

వృత్తిరీత్యా జాతీయ స్థాయిలో మీకు లభించిన విశిష్ట స్థానము లసంఖ్యాకములు. 1980లో శాంతి నికేతన్‌లో జరిగిన అఖిల భారత దేశీయ భాషా సమ్మేళన 'ద్రావిడ సంస్కృతి' విభాగమునకు అధ్యక్షునిగాను, త్రివేంద్రం ద్రావిడ భాషాధ్యయన సంస్థ వ్యవస్థాపక కార్యదర్శిగాను, అంతర్జాతీయ ద్రావిడ భాషాధ్యయన విద్యాలయ గౌరవ సంచాలకునిగాను మీరు నిర్వహించిన పదవులు మీ వ్యక్తిత్వ సామర్థ్యములకు లభించిన సువర్ణ పీఠికలు.

సద్గ్రంథ సౌగంధికా !

తెలుగు భాషామతల్లి తన రూపురేఖలు చక్కదిద్దుకొనుటకు మీ రచనలు, గ్రంథములు ఆదర్శములై నిలిచియున్నవనుటలో సందేహము లేదు. "తెలుగు దేశ్య వ్యుత్పత్తి నిఘంటువు", "బాలవ్యాకరణ దీపిక", "డిస్క్రిప్టివ్ గ్రామర్ అండ్ హేండ్ బుక్ ఆఫ్ మోడర్న్ తెలుగు", "ఆంధ్ర వాఙ్మయ పరిచయము" "నన్నె చోడుని కుమార సంభవ" ప్రచురణ పీఠిక, పితృపాదులు కోరాడ రామకృష్ణయ్య శతజయంతి సంచిక "సాహితీ నీరాజనము" – ఇత్యాది ఉద్గ్రంథములు మీ భాషా పరిశోధన సాహితీ కృషీవలత్వమును ఆ చంద్ర తారార్కము చరితార్థము చేయగల అక్షర దర్పణములు.

మహోమహోపన్యాసకా !

వివిధ భాషాపరిశోధనాంశములపై మీరొనర్చిన ఆంధ్ర–ఆంగ్ల భాషా మహోపన్యాసములు మధుర మందార మకరంద నిష్యందములై గంగాభంగ తరంగ నిర్ఝరములై సహృదయ హృదయరంజకములై యుండుననుట అనుభవైక వేద్యము. మచిలీపట్టణంలో జన్మించి, తండ్రినిమించిన తనయుడనిపించుకొని ఇంతింతై వటుడింతయైనరీతి జాతీయ అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన "తెలుగు తపస్వి"కి మేమందించే పురస్కృతి చంద్రునకొక నూలుపోగు మాత్రమే. ఆ మహాదేవుని అనుగ్రహమున ఈ మహాదేవునికి ఆయురారోగ్య భోగభాగ్యము లనంత పూరములై వర్షింపగలవని ఆశిస్తున్నాము.

పురస్కార వ్యవస్థాపకులు

**గౌ॥ మండలి బుద్ధప్రసాద్**

ఆంధ్రప్రదేశ్ మంత్రివర్యులు

గౌరవాధ్యక్షులు, కృష్ణాజిల్లా రచయితల సంఘం

విజయవాడ

27-9-2008


ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు



# తెలుగుభాషావేత్తకు, సాహితీవేత్తకు కార్యకర్తకు పురస్కారాలు

జాతీయస్థాయి, ప్రపంచ స్థాయి తెలుగు రచయితల సభల్ని ఘనంగా నిర్వహించి, వర్తమాన తెలుగు సాహితీలోకానికి కొత్త దారులు తెరిచిన కృష్ణాజిల్లా రచయితల సంఘం, ఇటీవల జరిపిన తెలుగు ప్రచార యాత్రలో మరింత ఘనతను సంపాదించుకొంది. ఇప్పుడు మరో గొప్ప పనిని చేపట్టింది. జీవితాంతం తెలుగు భాషాసాహిత్యాలకు సేవచేసిన తెలుగుతల్లి ముద్దుబిడ్డలు ముగ్గురికి ప్రతి ఏడాది పురస్కారాల నివ్వాలని తలపెట్టింది.

ఈ సంవత్సరానికి ఈ పురస్కారాలను పొందుతున్నవారి వివరాలు ఇవి.

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి గారికివ్వబోయే పురస్కారాన్ని ప్రసిద్ధ భాషావేత్తగా వారిని గౌరవించి ఇస్తున్నారు. ఈ పురస్కారాన్ని కీ.శే మండలి వెంకట కృష్ణారావు గారి పేర ఆయన కుమారులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ (మంత్రిగారు) నెలకొల్పారు.

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు 1921 డిసెంబరు 29వ తేదీన మచిలీపట్నంలో పుట్టారు. అంతర్జాతీయ భాషావేత్త. హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు అనే అంశంపైన 1961లో కలకత్తా విశ్వ విద్యాలయం నుంచి డిలిట్ పొందారు. తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువును రూపొందించారు. బాల ప్రౌఢవ్యాకరణ దీపిక, ఆధునిక తెలుగు భాషకు వర్ణనాత్మక వ్యాకరణం, ఆంధ్ర వాఙ్మయ పరిచయం మొదలైన గ్రంథాలను వెలువరించారు. 'నన్నెచోడుని కుమార సంభవము' గ్రంథానికి సాహిత్య అకాడెమీ పక్షాన సంపాదకులుగా వ్యవహరించారు. 1980లో శాంతినికేతన్‌లో జరిగిన అఖిలభారత దేశీయ భాషల సమ్మేళనంలో ద్రావిడ సంస్కృతి విభాగానికి అధ్యక్షులుగా ఉన్నారు. త్రివేంద్రంలోని ద్రావిడ భాషాధ్యయన సంస్థకు వ్యవస్థాపక కార్యదర్శి, అంతర్జాతీయ ద్రావిడ భాషాధ్యయన విద్యాలయానికి గౌరవ సంచాలకులు (1982-85)